





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

## సుక్కమ్మ - సెంద్రయ్య





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120012730

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సుక్కెమ్మ - సెంద్రయ్య

పాటలు

( జానపద గేయ కావ్యం )

చంద్రం

విజయ ప్రచురణలు

# కవితా రాగం

- డా॥ సంజీవదేవ్

కవితా రచన మూడు విధాలు.

వచన కవిత.

పద్య కవిత.

పాట కవిత.

వచన కవితకు రాగం వుండదు. పద్య కవితకు వుంటుంది రాగం, కాని తాళం వుండదు.

పాట కవితకు వుంటాయి రాగం, తాళం కూడా.

తాళయుగం కనుక ఆ మూడవది అయింది పాట. పాట కవిత సంగీతంతో సన్నిహితంగా వుంటుంది.

ఈ పాట కవిత తిరిగి 'మార్గ', 'దేశి' అని రెండు విధాలు. 'మార్గ'ను 'శాస్త్రీయ' అని, 'దేశి'ని 'జానపద' అని కూడ అంటారు. ఇవి ఇంగ్లీషులో అనిపించుకుంటాయి Classical అని, Folk అని.

చంద్రం రచించిన యీ "సుక్కమ్మ - సెంద్రయ్య పాటలు" జానపదాలు. ఇవి మొత్తం కలిసి ఇరవై రెండు పాటల చిరుకావ్యం.

ఇందులోని ఇతివృత్తాన్ని యీ కవి మాటల్లోనే చెప్పాలంటే "ఇందులో సుక్కమ్మ నాయిక, సెంద్రయ్య నాయకుడు. ఈ యిరువురి మధ్య యేర్పడిన ఆకర్షణ, వివాహం, విరహం, అన్యోన్య దాంపత్యం, ఈతి బాధలు... వగైరాలు వర్ణితాలు."

శాస్త్రీయ కవితలు భాషా పాండిత్యాన్ని, భావ గాంభీర్యాన్ని, ఛందోబద్ధతను, సంప్రదాయ రూపాల్ని ప్రదర్శిస్తే, జానపద కవితలు ప్రదర్శిస్తాయి సాంకేతిక సారళ్యాన్ని, గ్రామీణ పద ప్రయోగాన్ని, అమాయిక హృదయ స్పందనల్ని, తేలికైన అందాల కూర్పుల్ని మొదలైన వాటిని.

రచనా శిల్పం వున్నంత సరళంగానే వీటిలోని ఇతి వృత్తాలు కూడా మార్మికతను, మడతల మానసిక తత్వాలను ఎక్కువగా చూపక చదవగానే ఆలోచనలు లేని అవగాహన కలిగేట్లు వుంటాయి. నిరక్షరాస్యులైన గ్రామీణులు ఉచ్చ రించే ఫక్కీలో పద ప్రయోగాలుంటాయి. చుక్కమ్మకు బదులు సుక్కమ్మ అనటం, చింతను సింత అనటం, షోకును సోకు అనటం, తృప్తి పడటాన్ని తుపితి పడటం అని, దర్జాగా వుండటాన్ని దరిజాగా వుండటం అని... ఇటువంటి పద ప్రయోగాలు ఇందులో గోచరిస్తాయి.

ఈ జానపద కవితల్లో భావ ప్రకంపన ఎక్కువగా గోచరిస్తుంది. వీటిలో పదాల కూర్పు సుందరంగా, లయాత్మ కంగా వుంటుంది.

పాటలకు మాటల కూర్పు ప్రధానం. ఈ కూర్పుల కొన్నిటిలో యతి ప్రధానంగా వుంటుంది., మరికొన్నిటిలో అంత్యప్రాసలు కూడ వుంటాయి. వీటిలోని కూర్పులు మామూలువి కాక నేర్పుగల కూర్పులు కావాలి.

"సుక్క సూస్తాదని
సురుకు సూపించాను
మెచ్చుకుంటాదని
రెచ్చిపోయాను."

"సీలాటి రేవులో
నిండు కాలవలో
ఈ పక్క మఃనకేసి
ఆ పక్క తేలాను."

మాటల కూర్పు మంజులంగా వుంది; మానసోల్లాసం మృదువుగా వుంది; ప్రత్యేక ఘటనలు కావు, ప్రతి దినపు ఘటనలే; భావ చాపల్యం లేదు, భావ స్థైర్యమే.

కేవల భావుకత భావుకత అవుతుంది కాని, కవిత కాదు, అంచుకని భావుకత లేంది కూడ కవిత కాదు. భావుకతకు బాహ్యరూపాన్ని ప్రసాదించే మాధ్యమం (Medium) వుంటే కాని కవిత కాదు.

చిత్ర రచనకు మాధ్యమం రంగులైనట్లే, సంగీతానికి మాధ్యమం నాదమైనట్లే, నర్తనకు గతి అయినట్లే, కవితకు మాధ్యమం పదావళి. పదావళి లేనపుడు భావావళి అవ్యక్తం గానే మౌన రూపంలో వుండిపోతుంది.

"సుక్కమ్మ - సెంద్రయ్య పాటలు"లో భావావళి, పదావళి కూడ పరస్పర సంలగ్నమై సరిపోను వున్నాయి. జానపద రీతిలో, మానవతా నీతిలో.

ఈ పాటల్లోని శృంగారం, హాస్యం కూడ వెర్రితలలు వేయక వెర్రికాని తలల్లోనే వున్నాయి, మృదువుగా, మధురంగా. మరి రెండు పాటలు-

"మబ్బులాకాసాన
మసకేసు కున్నాయి
సిమ్మ సీకటి దారి
కమ్మేసు కున్నాది."

"సినుకు పడసాగింది
వణుకు మొదలయ్యింది
కునుకు కంటికి రాదు
కోడి కూసేసింది."

వానకాలపు వాతావరణ వర్ణన అంత మామూలు మాటల్లో రూపొందటం విలక్షణంగా వున్నది. అవన్నీ అతి సామాన్యపు నోటి మాటలు. కాని అవి ఇచ్చే రసానుభూతి అసామాన్యంగా వున్నది.

జానపద మాధ్యమంలో ఇంత కమనీయ కవితా సృష్టి జరగటం ఈ కవిలోని కవితా ప్రతిభ మేల్కొని వుండటానికి నిదర్శనం.

జానపద రీతిలో శాస్త్రీయ విషయాలకు అభివ్యక్తి నివ్వటం, శాస్త్రీయ రీతిలో జానపద విషయాలకు అభివ్యక్తి నివ్వటం జరగ కూడదనేది ఏమీ లేదు.

అయితే ఈ పాటల్లో ఇతివృత్తమూ జానపదమే, రచనారీతీ జానపదమే.

ఇద్దరు యువతీ యువకుల మధ్య ఇటువంటి ఘాటు లేని నాటు ప్రేమను సృష్టించటంలో ఈ కవి చంద్రం సఫలుడై నాడు. ఇందుకు మానవ మనస్తత్వపు వివిధమైన స్తరాలతో పరిచయం అవసరం.

తమ దాంపత్య జీవితంలోని శృంగార వాతావరణాన్ని సుకన్య వెల్లడించకుండాను వుండ లేదు, వున్నదున్నట్లూ వెల్లడించలేదు. అందుకే దాన్ని మృదువుగా వ్యంజనాత్మకంగా సూచిస్తుంది.

"సినిమాలు సూసొచ్చి
సిత్రాలు సేస్తాడు
సెప్పటానికి సిగ్గు తల్లో
సెంద్రయ్య మావ పోకిళ్ళు"

పైపాట ఎంతో మనోజ్ఞంగా, ఎంతో భావగర్భితంగా, ఎంతో కవిత్వమయంగా రచించబడింది. ఎంతగానో చెప్పాలసిన విషయాన్ని కొంత చెప్పటం ద్వారానే రక్తి కట్టించాడు యీ కవి. అల్పం ద్వారా అనల్పాన్ని చూపటం జరిగింది.

నేడు వచన కవిత తెలుగు సాహిత్యంలో పూర్తిగా విస్తరించి వున్నందువల్ల పద్య కవిత సన్నగిలింది, పాట కవిత మసకబారింది.

అటువంటి తరుణంలో కొందరైనా పాటల్ని రచించటం, అందులోను, జానపద రీతిలో రచించటం ఎంతో హృద్యంగా వున్నది.

వచన కవితలు ఎక్కువగా ఆలోచనను సృష్టిస్తూ వాటి రంగంలో అవి ప్రకాశిస్తూనే వున్నాయి. ఆలోచనకు తోడు అనుభూతి కూడా అవసరం. అటువంటి అవసరం తీర్చటానికి ఇటువంటి "సుక్కమ్మ-సెంద్రయ్య పాటలు" మాత్రం పొందటం ఎంతగానో వాంఛనీయం.

దీంతో పాత జీవితపు ప్రమిదల్లో నూతన ప్రాణ ప్రదీపాలు వెలుగుతాయి.



## అంకితం

విజయలక్ష్మికి

- చంద్రం -



శ్రీ "చంద్రం"

# అందాలు

సెంద్రయ్య : సుక్కమ్మ అందాలు ఎన్నోయి!
సూడ కన్నులు సాలకున్నాయి !!

సుక్కమ్మ కట్టింది
సూడ సక్కని కోక
కోకలో కొండంత
సోకు కురిపిచ్చింది ॥

వాలు జెడ యేసింది
బంతి పూ లెట్టింది
బంగారు లేడిలా
సెంగనా లేసింది ॥

ముక్కు పుడ కెట్టింది
ముద్దు లొలికిచ్చింది
బుగ్గల్ల యెదుపులో
సిగ్గు సిందిచ్చింది ॥

కాసంత బొట్టెట్టి
కనక మా లచ్మిలా
నావంక సూసింది
నవ్వుల్లు దువ్వింది ॥

# గొప్ప

సుక్కమ్మ : సెందరయ్య మావ కన్న
సెందుకు డేం గొప్ప ?

తలపాగా సుట్టుకోని
ములుకోలా పట్టుకోని
పొలం గట్టు మీద నడిసి
పోయేటప్పుడు సూడూ ॥

ఎండనకా వాననకా
కండలు కరిగించుకుంట
మడిలో ఎద్దుల యెనకే
నడిసే టప్పుడు సూడూ ॥

పగలనకా రేయనకా
పంట పొలాలల్లోనే
పురుగు పుట్ర బయం మరిసి
తిరిగేటప్పుడు సూడూ ॥

# మ రి యా ద

సుక్కమ్మ : ఎడమొడముగ నిలవపోయా
సెందరయ్య మావా! ఎ
న్నైవరు నమ్మగలరోయా
సెందరయ్య మావా !

సెంద్రయ్య : ఏటి తప్పు సేసినానే
సక్కని సుక్కా ? ను
వ్వివరంగా సెప్పునాకు
సక్కని సుక్కా !

సుక్కమ్మ : గడ్డివామి దొడ్డిలోన
సెందరయ్య మావా ! నువు
గడుసు పనులు సెయ్యలేదా ?
సెందరయ్య మావా !

సెంద్రయ్య : పడుసు పిల్ల కంటబడితే
సక్కని సుక్కా ! నే
పరవసించి పోతానే
సక్కని సుక్కా !

సుక్కమ్మ : పచ్చగడ్డి కొయ్యబోతే
సెందరయ్య మావా ! నువ్వు
వచ్చి యెనక నిలవలేదా ?
సెందరయ్య మావా !

సెంద్రయ్య : పచ్చపైరు పొలములోన
సక్కని సుక్కా ! నే
నెచ్చదనం కోరినానే
సక్కని సుక్కా !

సుక్కమ్మ : ఒంటరిగా ఆడదుంటే
సెందరయ్య మావా! నువ్వు
ఎంటబడీ పోడమేనా ?
సెందరయ్య మావా !

సెంద్రయ్య : మనసు పడ్డ పిల్లవనీ
సక్కని సుక్కా ! నీ
యెనక నేను పడ్డానే
సక్కని సుక్కా !

సుక్కమ్మ : మరియాదా తప్పకుండా
సెందరయ్య మావా ! మనం
మనువాడుట మంచిదయా
సెందరయ్య మావా !

# ని రీ క్ష ణ

సెంద్రయ్య : యాడకెల్లి పోయినావె
సుక్క్రమ్మా ? నీ
జాడె తెలవదాయె నాకు
సుక్క్రమ్మా !

పచ్చగడ్డి కోసు కోను
వస్తావని నీ కోసం
పంటసేను గట్టు మీద
పడిగాపులు కాశానే ॥

వట్టి గడ్డి కోసం నువు
వస్తే మాటాడాలని
గడ్డివామి దొడ్డిలోన
గడిపేశా రోజంతా ॥

మంచినీళ్ల కోసమైన
మానకండ వస్తావని
నీలాటి రేవు కాడ
నిలువుజీత మున్నానే ॥

# మెప్పు

సెంద్రయ్య : సుక్క సూస్తా దని
సురుకు సూపించాను
మెచ్చుకుంటా దని
రెచ్చిపోయాను !

నీలాటి రేవులో
నిండు కాలవలో
ఈ పక్క మునకేసి
ఆ పక్క తేలాను !

పంతానికి పోయి
పదిమంది సాచ్చిగా
గుడికాడ టెంకాయ
గుద్ది పగలేశాను !

రెండు కర్రలు పట్టి
రివ్వు రివ్వున తిప్పి
సంబరంలో గొప్ప
సాహసం సూపాను !

# సుక్కంటే సుక్క కాదు

సెంద్రయ్య సుక్కంటే సుక్క కాదురా,
నా సామిరంగ

సుక్కంటి పిల్ల లేదురా
నా సామిరంగ

సుక్కే నా కంటి మెరుపురా
నా సామిరంగ

సుక్కే నా యింటి కెలుగురా
నా సామిరంగ

సుక్క బుద్ధిమంతురాలు రా
నా సామిరంగ

సుక్క సుద్ధిమంతురాలు రా
నా సామిరంగ

సుక్క మొకం సూడ ముద్దురా
నా సామిరంగ

సుక్క పేరు పిలవ బుద్ధిరా
నా సామిరంగ

సుక్క ఒలే సొగసు గత్తెరా
నా సామిరంగ

సుక్క సాయ మొగలి పొత్తురా
నా సామిరంగ

సుక్క నాకు నచ్చినాదిరా
నా సామిరంగ

సుక్క నన్ను మెచ్చినాదిరా
నా సామిరంగ

# సంబరం

సుక్కమ్మ : అమ్మోరి సంబరంలో - నా మావ
ఆటల్లు ఆడినాడే - కమ్మగా
పాటల్లు పాడినాడే ॥

గుడి ముందు తన ఈడు
కుర్రోళ్లతో కూడి
కోలాట మాడి నాడే - నా మావ
గొంతెత్తి పాడి నాడే ॥

కర్ర బాగా తిప్పి
కన్ను సెదిరేటట్టు
సాముల్లు సేసినాడే - నా మావ
సాహసం సూపినాడే ॥

తాళాలు మోగించి
తైతక్క సిందేసి
బజనల్లు సేసినాడే - నా మావ
బత్తుడై పోయినాడే ॥

# విరహం

సెంద్రయ్య : సుక్కమ్మను సూడకండ
ఒక్క సెణం వుండలేను
సుక్కే నా సూపుల్లో
సురుకు సురుకు కదుల్తాది ॥

అప్పను సూసొస్తానని
సెప్పి తాను యెల్లినాది
నాలుగైదు రోజులైన
రాలే దేమైనాదో ॥

కన్ను మూసుకుంటె సాలు
కంటిలోనె మెదులుతాది
'మావా మరిశావా ?' అని
మరిమరీ అడుగుతాది ॥

సుక్క మొకం సూడకండ
ఒక్క ముద్ద మింగలేను
సుక్కలేని ఇంటిలోన
ఒక్క పొద్దు వుండలేను ॥

# జాలి గుండె

సెంద్రయ్య : జాలి గుండెలదోయి సుక్కమ్మ
బేల మనసూదోయి సుక్కమ్మ ॥

ఆవు కోసం దూడ
ఆరాటు పడుతుంటె
కంగారు పడతాది సుక్కమ్మ
కంట తడి పెడతాది సుక్కమ్మ ॥

కోడి పిల్లను గద్ద
కాల తన్నుకు పోతె
గోల పెట్టేస్తాది సుక్కమ్మ
బోరు నేడుస్తాది సుక్కమ్మ ॥

కొంటె పిలగా డెవరొ
కుక్క పిల్లను కొడితె
తను బాదపడతాది సుక్కమ్మ
తల్లడిలిపోతాది సుక్కమ్మ ॥

# బెంగ

సుక్కమ్మ : మావ రానేలేదు సెందురూడా !
మనసు బాగోలేదు సెందురూడా !

పొద్దు గూకే యేళ
పొరుగూరు యెల్లాడు
మాపటేలకి తాను
మల్లొత్త నన్నాడు ॥

మబ్బు లాకాసాన
ముసకేసు కున్నాయి
సిమ్మ సీకటి వారి
కమ్మేసు కున్నాది ॥

సినుకు పడసాగింది
వణుకు మొదలయ్యింది
కునుకు కంటికి రాదు
కోడి కూసేసింది ॥

# గురుతు

సెంద్రయ్య : కోయిల పాటలు
యింటేసాలు
సుక్క మాటతే
గురుతొస్తాయి

ఎన్నెల యెలుగులు
సూస్తే సాలు
సుక్క సూపుతే
గురుతొస్తాయి



పువ్వుల వాసన
తగిలితే సాలు
సుక్క వూసుతే
గురుతొస్తాయి





పసిపాపలు
ఎదురైతే సాలు
సుక్క నవ్వుతే
గురుతొస్తాయి

# మంచితనం

సుక్కమ్మ : లోకాన తప్పు బుట్టాడే
నా మావ
లోకుల్ని తప్పు బట్టాడే ॥

పెళ్లిలో కట్నాల
వల్ల కష్టాలంట!
కట్నాలు మాన మంటాడే
నా మావ
కష్టాలు తప్పు నంటాడే ॥

పిల్ల నిచ్చిన వోళ్లు
సల్ల గుండాలంటా!
అత్తోర్ని మెచ్చు మంటాడే
నా మావ
ఆనంద పెట్టు మంటాడే ॥

మొగుడు పెళ్లా లొక్క
మోస్తరుండాలంట!
ఎచ్చు తగ్గెందు కంటాడే
నా మావ
ఏరుపాటేల నంటాడే ॥

# సి త్రా లం

సుక్కమ్మ : సినిమాలు సూసొచ్చి
సిత్రాలు సేస్తాడు
సెప్పటానికి సిగ్గు తల్లో !
సెంద్రయ్య మావ పోకిళ్లు !

కొత్త పేసను నేర్పి
కుచ్చిళ్లు దిగజార్చి
కోకల్లు కట్ట మంటాడే
ఇంకేటొ
సోకుల్లు సూపమంటాడే ॥

రాగ వరసలు కట్టి
రష్యుగా గొంతెత్తి
పాటల్లు పాడ మంటాడే
సిందేసి
ఆటల్లు ఆడ మంటాడే ॥

సేయి సేయీా కలిపి
సేల గట్టుల మీద
సికార్లు సేద్ద మంటాడే
ఏటేటా
పోకిళ్లు పోద మంటాడే ॥

మొగము మొగమూ సేర్చి
సగము కళ్లూ మూసి
ముద్దెట్టు కుంద మంటాడే
ఆపైన
మొగమాట మెందు కంటాడే ॥

# తీర్తానికి

సుక్కమ్మ : జోడెడ్ల బండిలో
గూడు సాపలు కట్టి
తీర్తాని కెల్దారి మావా !
మనం
దేవుణ్ణి సూద్దారి మావా !

గడ్డి వొత్తుగ పరిసి
కంబళీ పక్కేసి
దరిజాగ కూసోని మావా !
మనం
తరలి యెల్లొద్దారి మావా !

తొట్టిలో కూసుండ-
బెట్టి మన సిన్నోణ్ణి
ఎద్దుల్ని తోలించుదారీ,
మనం
ముద్దుగా సూసుకుందారీ

జీడీలు తినిపించి
సోడాలు తాగించి
సిత్రాలు సూపించు దారి,
మనం
సిన్నోళ్ళకి మురిపించుదారి

# ప ని వా డు

సుక్కమ్మ : పంచి పైకెగ గట్టి
పార సేతాబట్టి
మడిలోన నా మావ
నడుము వొంచాడంటే

అబ్బబ్బొ మడి సెక్క
అద్దమై పోవాల !

పొగరెక్కి బుసకొట్టు
పోట్లగిత్తే అయిన
మావ పిలిశాడంటె
మచ్చికై మెడదించి

కాడెత్తు కోవాల !
గబగబా సాగాల !

సెంబట్టుకొని మావ
సెంత సేరాడంటె
తరిపి గేదెలు వొళ్లు-
మరిసి పొదుగులు సేపి

పాల దారలు కురిసి
వరదలై పారాల !

# సోజ్జాలు

సంప్రదయ్య : సుక్కమ్మ సోజ్జాలు
లెక్కలేనన్ని
పక్కనుంటే సాలు
బతుకు పండేను

ఇల్లలికి ముగ్గెట్టి
ఇల్లాలి నంటాది
పిల్లడికి బువ్వెట్టి
తల్లి నంటాది ॥

పొలము గట్టున నిలిసి
బూదేవి నంటాది
వరి సేనిలో వంగి
వనలచ్మి నంటాది ॥

కాసంత బొట్టెట్టి
గంగమ్మ నంటాది
గోవులకు మేతెట్టి
గోపెమ్మ నంటాది ॥

కూనిరాగం తీసి
కోయిల్మి అంటాది
కొక్కొరో అని కూసి
కోడి నంటాది ॥

కొప్పులో పూలెట్టి
గౌంతెమ్మ నంటాది
అద్దరాతిరి నాకు
ఆలి నంటాది ॥

# దిష్టి

సుక్కమ్మ : ఏడ నిను దాసేది ఓ మావా !
ఎలా నిను కాసేది నా మావా !

బరువు బస్తా ఎత్తి
పరుగూన వస్తాంటె
ఆడోళ్లు నీ వంక
ఆబగా సూస్తారు ॥

పొట్లు గిత్తను పట్టి
పొగరణగ గొడతాంటె
పడుసు పిల్లలు డిల్ల-
పడి విన్ను సూస్తారు ॥

రాజులా దారంట
రోజు నువ్వొస్తాంటె
ఊరి ఆడోళ్లంత
ఓరగా సూస్తారు ॥

దిష్టి తీస్తానంటె
'దేనికే' అంటావు
ఆడోళ్ల సూపులో
కీడు తెలవదు నీకు

# ఉత్తమురాలు

సంప్రదాయ : ఏవేవో తనకు కొని-
పెట్టమని సుక్కమ్మ
ఎన్నడూ నన్నడగ లేదు
ఎద్దేవ సేయలేదు

పట్టు సీరను తాను
కట్టుకుంటే సూసి
మురిసిపోవా లనీ
మోజుపడి కొంటేను

కడుసు దారని సుక్క
కసురు కున్నాది !

ఎండి పట్టాలు తా
నెట్టుకుంటే సూసి
తుపితి పడదామనీ
తెచ్చి నేనిస్తేను

దండగని నా సుక్క
మండి పడ్డాది !

## కష్టజీవి

సుక్కమ్మ : పనికోసమే పుట్టినావా ?
ఓ మావ !
పనిలోనె సుకము సూశావా ? ॥

పగలనక రేయనక
పని సేసుకుంటావు
అలుపు సొలుపూ లేవ ?
కలకాల మింతేన ? ॥

తిని కూరుసుంటేను
తిండెట్ట వస్తాది ?
కష్ట పడ్డోడికే
గంజి నీళ్లంటావు ! ॥

తెల్ల బట్టలు కట్టి
ఒళ్లు సుక పెట్టేసి
కూసోని కులికేటి
గొప్పోళ్ల మాటేటి ? ॥

తిని తిరిగె సోమర్లు
విను సూసి సిగ్గుపడి
పని పాటు సెయ్యాల
మనుసులై బతకాల

# అచ్చారం

సుక్కమ్మ : పగలంత పొలములో
పనిచేసి వస్తావు
ఇపుడు సదు వేందయ్య మావా ?
ఇంటిలో కూసుండలేవా ?

సెంద్రయ్య : ఇంత వయసొచ్చినా
ఏలిముద్దరె మనది
సదువు నేరుసుకోని సుక్కా !
సంతకం పెడదమెంచక్కా !

సుక్కమ్మ : ఇంత వయసొచ్చిందది
ఇపుడు సదివే దేంది ?
పిలగాళ్ల పక్కనే మావా !
కలిసి నువు కూసుండ గలవా ?

సెంద్రయ్య : సంటోళ్లు సక్కగా
సదువుకుంటా వుంటె
మొద్దుమొగ మేసుకొని
పెద్ద లుండా లంటె ?
సదువుకూ వయసుకూ
సమ్మంద మేటసలు ?
సంటోళ్ల మాదిరే
సదువు కుందారిలే
అచ్చరం నేరిస్తే సుక్కా !
అన్ని తెలుసును మనకు లెక్కా !

# బక్క రైతు

సెంద్రయ్య }
సుక్కమ్మ } : వాన కురిసీ వరద పొంగి
పంట మొత్తం మునిగి పోతే
బక్క రైతుకు దిక్కు ఎవరయ్యా ?
మా
తిప్పలెవరికి చెప్పుకోమయ్యా ?

అప్పొ సప్పో సేసి బావిని
అదునులో నాటేసి పెంచీ
గంగ తల్లికి కాను కెట్టాము !
మా
కొంప లిట్టా కూల్చు కున్నాము !

హాయి మాటలు సెప్పి గెలిసీ
గద్దె లెక్కే పెద్ద మనుసులు
బడుగు రైతుల బాద లింటారా ?
మా
కష్ట సుకములు కనుక్కుంటారా ?

కంటు తడి యెట్టేసుకుంటే
సానుబూతీ సూపుతుంటే
కష్టమంతా తీరిపోత్తాదా ?
మా
నష్టమంతా పూడిపోత్తాదా ?

# వ ల స

సెంద్రయ్య : వానెక్కువైతేను
వరద ముంచేస్తాది
వాన పడకుంటేను
పైరెండి పోతాది
తిండి గింజల కరువె
తీరకున్నా దీడ
ఏడకైనా మనం
ఎల్లి పోదారే

సుక్కమ్మ : ఈడనే పుట్టాము
ఈడనే పెరిగాము
ఈ బూమి మన తల్లి
ఈ గాలి మన తండ్రి
కష్టాలు నష్టాలు
కలకాల ముంటాయ ?
ఇంకేడకి మనం
ఎల్లొద్దు మావా !

సెంద్రయ్య : అప్పులోళ్లకి బూవిఁ
అప్ప సెప్పేశాము
కూలో నాలో సేసు-
కోవాలి మన మింక
ఊరితో మన ఋణము
తీరిపోనాదిలే
ఏడకైనా మనం
ఎల్లి పోదారే

సుక్కమ్మ : రెక్కలే మనకింక
దిక్కు దారీ యైతె
ఏడ కేడకో మనం
ఎతుకుతా పోవాల ?
కష్టజీవుల కీడ
గంజి నీళ్లే కరువ ?
ఇంకేడకీ మనం
ఎల్లొద్దు మావా !

సెంద్రయ్య : రైతునై దరిజాగ
రాజై మేలిన సోట
కూలోడిగా నేను
కుదురుకో లేనే !
పాలేరుగా నేను
బతుకీడ్వ లేనే !
ఏడకైనా మనం
ఎల్లి పోదారే !

# మా ప్రచురణలు

చిరంజీవి బాల గేయాలు

చిన్నారి బాల గీతాలు

కవితా చిత్రాలు

శ్రీనివాస శతకం

సుబ్రహ్మణ్య-సౌందర్య పాటలు

శృంగార నాయికలు